# పరిచయ ఆశీస్సు

మిత్రులు శ్రీ రెడ్డిగారు రచించిన తరంగాలను ఖండకావ్య సంపుటిని చదివి ఆనందించితిని. ఇవి కవిగారి హృదయ సముద్రము నుండి పెల్లుబికిన కవితాతరంగాలు. ఇందు కొన్ని వృత్త జాతి రూపములు, కొన్ని ద్విపదమయములు; కొన్ని గేయాత్మకములు. ఏ రూపమున నున్నను ఇందలి ఖండ కావ్యములన్నియు కవిగారి హృదయ మార్దవమును, మానవతాభిమానమును, సామాన్య ప్రజానురక్తిని సూచించు చున్నవి.

ఇందలి ఖండకావ్యముల వస్తువులందు కూడ వైవిధ్యముకలదు. అందు కొన్ని దేశమునకు సంబంధించినవి; కొన్ని రైతులకు సంబంధించినవి; కొన్ని ఆత్మాశ్రయములు; కొన్ని మహనీయులైన వ్యక్తులకు సంబంధించినవి; కొన్ని లోకముపోకడకు సంబంధించినవి. మానవ మారణాయుధముల తోడను, వర్ణ కుల భేదములతోడను, అసమానతా ద్వేషముల తోడను, స్వార్థభావములతోడను కూడిన లోకమునకు శ్రేయ మెక్కడ లభించునని కవిగారు వేదన పొందుచున్నారు. "ఆరిపోయె నా బుద్ధుని ఆదిహింస" వంటి పద్యము యిందుకు తార్కాణములు. "మానవా! నాదు కన్నీరు మహిని నేడు ప్రళయ దావాగ్ని చర్లార్పగలుగు నేని నదుల సృష్టించి కన్నీటి నింపుకొందు" అనుట కవిగారి హృదయ వైశాల్యమును విశ్వశ్రేయో వాంఛను చాటు చున్నది. భరతాంబ, భరత భూమి, మాతృ భూమి నిస్పృహ అను కావ్యములు వారి దేశభక్తికిని, ఆదర్శయువతి, తెలుగు శౌర్యము తెలంగాణ అనునవి వారి అఖండాంధ్రాభిమానమునకును నిదర్శనములుగా నున్నవి.

కవిగారికి పల్లెల సహజ సౌందర్యమునందును, దినమంతయు కష్టపడి ప్రజలకు తిండి సమకూర్చు రైతు సోదరులందును అభిమానము మెండు. "చిరు కొండపై చెట్ల చేమల బుట్టియు" అను సీసము పల్లె

సౌందర్యమును ప్రత్యక్షీకరించు చున్నది. శిల్పి ఆత్మగతమాతని శిల్ప కళాకౌశలమును చక్కగా ప్రకటించు చున్నది. పుష్పాంజలి భావగర్భిత మైన ఖండిక. కవి గారు పూవును "విశ్వమందున వేలేండ్లు వెతలుచెంది ప్రియుల కొఱకయి ప్రాణాలు వీడినట్టి ప్రేమధనులకును, కోరిక స్వాతంత్ర్యరణమున కూలినట్టి వీరయోధులకును సమర్పింపదలచు చున్నారు. ఇది వారి హృదయమార్దవ వైశాల్యములకు తార్కాణము"గా గాలి కుఱ్ఱడు నిను జూచి కళ్ళు మండి ఎన్నిగిలిగింతలో పెట్టి నిన్ను తుదకు మోసగించె"నను పద్యము వ్యంగ్య గర్భితమై యున్నది.

ఈ సంపుటమున ఆత్మాశ్రయములును ప్రేమయములులైన ఖండికలు కూడ నున్నవి. హృదయవేదన అచ్చమైన భావకవితాఖండిక. ఎంకికి సంబంధించిన కావ్యములు ప్రేమ శృంగారమయములు. ఎంకి ధరించిన వస్తువేదైనను ఆమె కపారమైన సౌందర్యము నొసంగును. ఆనంద సౌందర్యములు మనస్సంబంధులే కాని కేవల వస్తు సంబంధులు కావనుట సత్యము. అను రాజసదనము కవిగారి ప్రేమ నైర్మల్యమును చెప్పక చెప్పు చున్నది.

కవిగారు లోక పరిశీలనమున నారితేరినవారు. వారు లోకము పోకడను గూర్చి వ్రాసిన కావ్యము లీ విషయమును విశదముచేయు చున్నవి. భాషా రాష్ట్రాలకై పరితపించి పోరాడుట కంటె ప్రజలకు తిండి బట్టలను సమకూర్చుటకై యత్నించుట మంచిదని వారిభావము. పైస అను కావ్యము ధనమూల మిదం జగత్తను సత్యమును రుజువు చేయు చున్నది. పైస లేంది ప్రపంచంలో బ్రతుకవద్దు - పైస వుంటె పాప పుణ్యాలన్ని రద్దు" అనునది "సర్వేగుణాః కాంచన మాశ్రమంతి" అను విషయమును మరొక భాషలో చెప్పు చున్నది. అపవాదు అను కావ్యము లోకమున నకారణాపవాదములకుగుఱియై జీవితములను బాయు అమాయికల వృత్తాంతమును వివరించు చున్నది. 'ఎందుకో' అను కావ్యము విధివైపరీత్యములను గూర్చి కవిగారు పడు బాధ కక్షర రూపము.

స్వాగతము రెడ్డీ హాస్టలులో ప్రజా ప్రతినిధుల కీయబడిన స్వాగతము. అచట కూడిన ప్రజా ప్రతినిధులు "యువకులై దేశ సంగ్రామ

యోధులగుచు కొదమ సింగంబులై ఘోరముగను సమరమును సల్పి తల్లి సంతసమునొంద" నొక్కచో కలసియుండిరి. వారు కావించిన ఘన కార్యములన్నియు నుగ్గడించి కవిగారు "శిథిలమై అంధకారాన జీర్ణమైన భారతీయుల విభవంబు పలు దిశలకు ప్రాకునట్టులు చేయుడీ ప్రతిన పూని" అని ప్రార్థించుచున్నారు. కీ.శే. రాజాబహద్దరు వేంకటరామరెడ్డి మహాపురుషులు. వారు హైదరాబాదు నగరమునకును తెలంగాణము నకును రాజకీయ సాంఘిక విద్యారంగములలో కావించిన మేలు చిర స్మరణీయము. వారు "హలము పట్టియె దున్నెడి హాలికులకు కలము పట్టగ నేర్పి" తమ బలమునంత ధారవోసిన తెల్గు వీరులు. వారికెనుబది రెండు సంవత్సరములు నిండిన సందర్భమున కవిగారు వారొనర్చిన యుపకారములన్నిటిని కృతజ్ఞతా పూర్వకముగా స్మరించి వారికె పద్యనీరాజన మొసగియున్నారు.

కవిగారిని నేనెఱుగను. వారి పద్యములుచూచి, అందలి యుదారా శయములు గ్రహించి, వారి హృదయతత్త్వము నూహింపగలిగినాను. వారు దేశభక్తులు; ప్రజాసక్తులు; విద్యాశక్తులు, వారి పద్యములును గేయ ములను నిరాడంబరము సులభములైన భాషలో నుదాత్తములైన భావ ములను వెల్వరించుచున్నవి. అచ్చటచ్చట వారు భాషావిషయమునకొన్ని స్వతంత్ర ప్రయోగములు కావించియున్నారు. వానిని వలయుచో సులభ ముగా సవరించు కొనవచ్చును. ఉదారాశయ పూరితములైన యిట్టి పద్యగేయములను రచించినందుకు శ్రీ రెడ్డిగారినభినందించుచు వారింకను రసవన్మనోజ్ఞములైన రచనలు కావించి ఆంధ్ర భాషకభినవాలంకార ములు కూర్తురని కోరుచున్నాను.

17-9-1978 దివాకర్ల వేంకటావధాని

హైదరాబాదు-27

# మానవా!

మానవ కల్యాణమండపంబున నేడు
మారణ సామగ్రి చేరుచుండ
విశ్వశాంతియనెడి వేదికపై నేడు
పరమాణు బాంబులు పగులుచుండ
సర్వమానవ సమసామ్య సంఘమునందు
రంగు బేధాలెన్నొ తొంగిచూడ
ప్రతివారు సమమని పలికెడు దేశాన
ఒక్కడే సర్వమై నిలుచుండ
ఇంక మానవ రక్షణ యెచటగలదు
ఇంక మానవ శ్రేయమిందెచట గలదు
ఇంక విశ్వశాంతికి దారి ఎచటగలదు
అంధకారమే యీనాటి అవనినిండ.

మానవా! విశ్వశాంతికి మార్గమేది
మానవా! ఈ అశాంతికి మందులేవి
కానవా ఈ అశాంతికి కారణంబు
అవని అధికారవాంఛా దురాశకాదె.

మనసునందున నెన్నియో మాటలున్న
పైకి తామెంతో ప్రజల సేవకులమంచు
పలుకువారలు వందలీనాడు భువిని
మానవా సత్యమెద్దిరా మహినినేడు.

స్వార్థమేనోయి మానవ సంఘమందు
స్వార్థమేనోయి మానవ సర్వజగము
స్వార్థ రహితుడవీవైన సకలజగము
స్వర్గమేనోయి మానవ సత్యమిద్ది.

ఆరిపోయెనా బుద్ధుని యా అహింస
ప్రేమసందేశ మీపాడు భూమినుండి
అవియె లేకున్న నీ ప్రపంచాత్మకెపుడు
శాంతియును లేదు మానవా క్రాంతిలేదు.

ఒకని రక్తము త్రావుట కొకడుజూచు
సంఘమా లేక ఘోరసంగ్రామ మిదియా?
కలియుగం బిదియా లేక కాలుపురము
తెల్పు మానవ! ఈనాడు తెల్లముగను.

ఇదియ టీనాటి శాంతి మరింక నేమి
మానవా! నీవు వీరికై మడయవలయు
అదిగో వినవేమి ఘోర విశ్వాగ్నిలోని
ప్రళయ రాక్షస రవములు ప్రజ్వరిల్లె.

మానవా నేనెట్లు మరతు నీ ఘోరాలు
కరుణా రసంబు లీ కలిని లేవు
దానవా నిన్నెట్లు దండింతు నీనాడు
పరమాణు శక్తినీ పంచజేర
ప్రేమయే లేదోయి పెనుభూతములు భాయి
రక్తమాంసాలిమ్ము భుక్తికొరకు
పీనుగ పెంటలో పిల్లవాం డేడ్వగా
పీనుల విందుగా వినగనిమ్ము
ఏమి పాపము చేసి నే నీ యుగాన
పుట్టి కన్నీరు కాల్వలై భువినిబార
ఏడ్చుచుంటినో లాభమింతేని లేక
ఏమిసేయుదు మానవా! ఇంతకన్న.

మానవా నాదు కన్నీరు మహిని నేడు
ప్రళయ దావాగ్ని చల్లార్ప కలుగునేని
నదుల సృష్టించి కన్నీటి నంపుకొందు
ఏడ్తు కన్నీరు వరదలై ఇలనుముంచ.

# మా పల్లె

రంకె వేయుచు కొండవంకల దిరుగాడు
ఆబోతు మాపల్లె కందగాడు
పాలిచ్చి తానేమొ పచ్చిక భక్షించు
గోమాత మాపల్లె కోమలాంగి
జాము రేతిరి లేచి చలిలేక గిలిలేక
పనిచేసి కొనెడి మాపల్లె పడుచు
తొలికోడి కూతతో నులిమి కన్నులు లేచి
దుక్కినీటికి మోటదోలు రైతు

సూర్యుడు దయింపగనె పల్లె సుగుణులంత
మోము కడుకొని చల్దులు మోసికొంచు
పచ్చచేలలో కెడుతుంటె ప్రకృతినవ్వు
కనులవిందుగ మాపల్లె కాంచనగును.

పచ్చని చేలలో పచ్చల కుచ్చులై
సస్యాలు కనుపించు సర్వదిశల
అంబా యటంచును అటునిటు పరువెత్తు
ఆవుదూడల గుంపు లందముగను
వాయు తరంగాలు వడిగదాకిన యంత
సాగగ వీచులై ఊగుచేలు
బసవన్నలను బట్టి బంధించి పొలములో
ఫాలము తోలెడి బీదహాలికులును

అంబలిని మోసికొని పోవు ఆడవారు
కంబలిని భుజముపై నిడి కదలుకూలి
గొర్రెలను మేకలను తోలు గొల్లవాడు
కనులవిందుగ మాపల్లె కాంచనగును.

చిరుకొండపై చెట్లచేమల బుట్టియు
ప్రవహించు సెలయేరు పాడుకొంచు
దొరగా మాగియు దూరాన చనుచుండ
హసియించి పిలచు మా అడవిపండ్లు
పచ్చప్రమానులపైన వెచ్చగా కూర్చుండి
గొంతెత్తి పాడెడి కోయిలలును
సహజ యౌవనముతో సహజ సుందరతతో
నడయాడు పల్లె చిన్నారి పడుచు
చూడుడీ వచ్చి భరతాంబ సుతులుకోట్లు
ప్రకృతి కౌగిట హాయిగా పవ్వళింప
పల్లె సౌందర్యమింతని పాడతరమె
కనులవిందుగ మాపల్లె కాంచనగును.

—

# రైతు

పచ్చనిచేలలో వరిసెల బట్టియు
రాలురువ్వేటి బీదరైతురాజ
మండుటెండల నెత్తిమాడగా కష్టించి
పనిజేసి బ్రతికెడి పల్లెవాడ
రాత్రింబవళ్లు నీరక్తమ్ము చెమటగా
మార్చి భూములదున్ను మార్గదర్శి
ఆవుగేదల నెన్నొ అడవులందున మేపి
పట్టణాలకు పాలు పంపువాడ

ఏల మాటాడకుండనే తూలిపడెదు
రాత్రి ఉపవాసముంటివా రైతురాజ
కోట్లజీవుల పెంచు నీకొరకు జనులు
నేరుధాన్యమ్ము నివ్వరా ఊతిని నేడు.



# భరతాంబ

సర్వభూముల కహింసాసూక్తి బోధించె
గాంధిమహాత్ముండు కరుణతోడ
దేశదేశంబుల దిరిగి సుభాస్‌బోసు
వీరత్వదీపంబు వెలుగజేసె
హిందుత్వ మహిమంబు ఇలలోన
చాటించి ప్రకటింపజూచె సావర్కరుండు
భారతీయులు ధైర్యబల సాహసంబుల
శక్తి ప్రదర్శించె భక్తసింగు
ఎందరెందరో మహనీయులిట్లు నీకు
పుత్రులై పుట్టి పృథ్విలో పేరుకెక్కి
విశ్వమంతట నీ మహా విజయభేరి
మ్రోయజేసిరి భరతాంబ ముదముగాను.

రణధీరులైనట్టి రాచపుత్రులు నీకు
ఇలలోన రక్షణనిచ్చుచుండ
ఘోరయుద్ధములలో కొదమ సింగమువోలె
పోటాడు గోరఖ పుత్రులుండ
పులులగుండెలు జీల్చగల పౌరషంబున్న
పంజాబు సిక్కులీ పంచనుండ
పరుల గుండె యందు బల్లెమై మెలగిన
ధీరాంధ్ర మారాఠి వీరులుండ
వీరపుత్రులు వంగకుమారులుండ
జగడమన భీతినొందని జాటులుండ
భయము నీకేల భరతాంబ భద్రముగను
ఎట్టి యాపదలేక వర్ధిల్లినావు.

నందననామ సంవత్సర నవ్య తెలుగు
ప్రజా ప్రతినిధులకు రెడ్డిహాస్టలులో

# స్వాగతము

స్వాగతము తెల్గువీరులకు స్వాగతంబు
స్వాగతము మా తెలంగాణ సజ్జనులకు
స్వార్ధరహితులు మీరయి సర్వజనుల
మన్ననల నొందుచున్నారు మహినినేడు.

మా తెలంగాణ తల్లియే మంచిరోజు
మిమ్ముకన్నదో అందుకే మీరలిపుడు
భావిభారత వీరులై భాగ్యనగర
నాజిపాలన కాలతో నలిపినారు.

చిరుతప్రాయాన చిరునవ్వు చివురులెత్త
తెలుగు తేనియ తీపిలో తేలియాడి
హృదయముప్పొంగు తెలుగమ్మ యొడినిమీరు
ఆడుకొన్నారు అత్తత్త యంచు నాడు.

యువకులై దేశసంగ్రామ యోధులగుచు
కొదమ సింగంబులై మీరు ఘోరముగను
సమరమును సల్పి తల్లి సంతసమునొంద
కలయుచుంటిరి ఈనాడు కడుముదమున.

భావిభారత పౌరులై పల్లెలందు
కోటి స్వర్గాల సృష్టించు కొడుకులంత
ఏకమయినారు తెలుగమ్మ యేడ్వమాని
నవ్వుమొకసారి నందన నవయుగాన.

నందనవనాలు సృష్టించి నవపథాన
కూడుగుడ్డయు మరి ఇంటికొరత దీర్చి
బీదతన మను దుర్భర బాధనుండి
ముక్తి గల్గించుడీ తల్లి ముదమునొంద.

పెక్కువత్సరాల్ గడచిన పిదప నేడు
మరల యా పావనంబైన మందిరమున
అందరేకమై కూర్చుండ అతి ముదమున
నా తెలంగాణ తల్లి సంతసము నొందె.

గడచిపోయిన కాలాన కట్టిబెట్టి
శిథిలమై అంధకారాన జీర్ణమైన
భారతీయుల విభవంబు పలుదిశలకు
ప్రాకునట్టుల జేయుడీ ప్రతినబూని.



# భారత భూమి

నవఖండములకెల్ల నవనీతి బోధించు
పంతులమ్మరయె నాదు భరతభూమి
గంగగోదావరి తుంగభద్రలు పారు
బహుపుణ్యసీమ నా భరతభూమి
గోమాతలనుపెంచి కోట్లజనము సాకు
పాడిపంటలకిల్లు భరతభూమి
సత్యమ్మహింసను సాధించినట్టి మా
గాంధి బుద్ధులగన్న కర్మభూమి

పుణ్యతీర్థాల నలరారు పూజ్యభూమి
సర్వమతములకిల్లైన సత్యభూమి
భారతీయుల పుణ్యంబు పండుభూమి
ప్రణుతులర్పింతు నీకు నా భాగ్యభూమి.



# ఆంధ్రయువతి

ఆంధ్రయువతులు వీరుల యమ్మలగుచు
తెలుగుగడ్డను వీరత్వ తేజమందు
ముంచుటెన్నడో ఆంధ్రులముక్తి ఎపుడో
తెలుపుమో ఆంధ్రదేశీయ ధీరవనిత!

ఆంధ్ర నారీమణి ఆదర్శ సోదరి
వీరుల కనబోవు వీరమాత
నీవల్లనేకదా నీఆంధ్ర లక్ష్మికి
చేకూరు విజయంబు లోకమందు
నీలోననే కదా నిజముగా జన్మించి
పేరుకెక్కిరి పసిబిడ్డ లంత
నీవల్లనే కదా నీతెల్గు బిడ్డలు
త్రాగిరి క్షీరధారలను నేడు

నీవె ఆంధ్రావనికి నింక నిహము పరము
నీవె ఆంధ్రులపాలిటి భావిరేఖ
నీవె ఆంధ్రుల సత్యము నిత్యకళవు
నీవె ఆంధ్రుల ఇండ్లలో నెగడుదివ్వె.

—:o:—

# తెలుగు శౌర్యము

వీరబొబ్బిలివారు పారబోసినరక్త
మీనాడు మాఇంట కానుపించు
రుద్రమ్మ శౌర్యాగ్ని రుధిరంబు తెల్గులో
అరుణకాంతుల గూడి అలరుచుండు
కొండవీటి నృపాలకుల బాహుదండముల్
పదునుకత్తులకయ్యె ప్రాకులాడు
బాలచంద్రుని కత్తిపదను ధారలు నేడు
అఖిలాంధ్ర జనులచే ఖ్యాతినొందు

ఇంతియేకాదు మాఇంట ఇంకనుంది
ఖడ్గతిక్కన బట్టిన కత్తికూడ
ఆంధ్రపాపయ బొడ్లోని తళుకుబాకు
కృష్ణరాయలు గాంచిన కీర్తియంత

తరకు తురుష్కులకంఠాన కత్తియా 1903
మెతకు కాపన్న నే వెతుకుకొందు
తానీష సేవకై తనప్రాణమొడ్డిన
అక్కన్న మాదన్న నభినుతింతు
ఢిల్లీ పాదుషాతోడ డీకొని పోరిన
సర్వాయి పాపని సన్నుతింతు

వలిపాదముల చెంత ప్రాణాలు పీడిన
పార్వతమ్మను నేను ప్రస్తుతింతు

తెలుగువీరులు జూపిన వెలుగులోన
కోటికంఠాలు ఏకమై పాటబాడ
పాడుకొందును నాతొల్లి భాగ్యగరిమ
వెతుకుకొందును నాపూర్వ విభవమెల్ల.

—X—

# శిల్పి

ఎల్లోర గుహాలలో ఇల్లునే నిర్మించి
శిల్పంబులెన్నియో చెక్కినాను,
యమునానది తల్లి రమణీయ జలవల్లి
తీరాన తాజునే దించినాను,
అమరావతి శిల్ప సముదాయము నేను
ఉలిబట్టి చక్కగా మలచినాను,
వేయిస్తంభాలతో వెలసిన విలువైన
ఓరుగల్ గుడిగట్టి తీరినాను,

ఇంతియే కాదు చెక్కితి నింక యెన్నొ
జీవమేలేని శిలలకు జీవమొసగి
ప్రతిమలను సృష్టి గావించి బ్రతుకులోని
కొత్త అందాలు చేకూర్చుకొంటి నేను.

* * *

# పుష్పాంజలి

లేచినదె తడువుగా నేను పాచిమోము
కడగుకొనబోయి ప్రక్కన కానబడిన
పూవునొకదాని కోసియు బుట్టయందు
దాచియుంచితి ప్రియురాలి దరికినంప.

అప్పుడే యందెనొక లేఖ అందులోన
యేమియున్నదొ యనుకొని మోమువాడ
విప్పిచూచియు అప్పుడే కుప్పవోలె
కూలిపోయితి దుఃఖాన కుళ్లికుమిలి.

భయము లేదింక ప్రియతమా! భాగ్యములను
పొందుచును సుఖముగ నుండు పృథ్విలోన
ప్రేమకును పెళ్లికిని చాల బేధముండు
ప్రేమజీవుల కసలు యీ పెళ్లి వలదు.

ఏ హృదయ రాజ్ఞి పాదాల నిడియు నిన్ను
ముక్తి నొందింతునే నేను ముద్దు సుమమ
ఏ హృదయదేవి లేదింక నిచట నాకు
జాలుగా జారుకన్నీట జలకమాడ.

బాలసూర్యుని జూచియు బేలవగుచు
ఏల నవ్వితివే పూవ ఈ దినమున
నవ్వులే తడవుగ నిన్ను క్రొవ్వలపుం
త్రుంచితిని నిన్ను ప్రియురాలి పంచచేర్ప.

గాలి కుర్రడు నినుజూచి కన్నుమండి
ఎన్ని గిలిగింతలో పెట్టి నిన్ను తుదకు
మోసగించెను నినుగూడి మురియుదునని
కాని ఆ ఆశలన్నియు కలలె యయ్యె

విశ్వమందున వేలేండ్ల వెతలుజెంది
ప్రియుల కొరకయి ప్రాణాలు వీడినట్టి
ప్రేమధన్యులైన వారికి విజ్ఞులైన
జీవకోటికి నిన్నిత్తు చిన్నపూవ.

కోరి స్వాతంత్ర్యరణమున కూలినట్టి
వీరయోధులు నడచిన దారిలోన
నిన్ను నర్పించి ఆదారి మన్నులోన
కలిసి పోయిన మోక్షంబు కలుగుపూవ.

ప్రాణములనైన బలిజేయు ప్రతినబూని
విశ్వశాంతిని కాపాడు వీరవరుల
పాదముల యందు నిడినాదు వీరభక్తి
చూపెదను ముద్దు పుష్పమా! కోపపడకు

తప్పులేకుండనే యెన్నొ ముప్పులందు
చిక్కుకొని ప్రాణములిడిన జీవకోటి
కాత్మశాంతిని చేకూర్ప అడుగులందు
అర్పితముచేతు పుష్పమా హారతులను.



# హృదయ వేదన

నీదు ప్రేమకై తపియించు నేనొకండ
విరహాజీవిని సువిశాల విశ్వమందు
ఎందరున్నారొ నావలె నేరికెరుక
కాలిపోవుచు ప్రియురాలి కరుణలేక.

నీదు ప్రేమకై విలపించి నిదురవీడి
ఆశతో సౌధములనెన్నొ ఆకసమున
కట్టుకొన్నాను కలనైన కనికరమ్ము
బరపిధన్యుని జేయవే భాగ్యరాశి.

సుగుణములనెన్నిటినొ గాని జూడగల్గు
హృదయనయనంబు లీనాడు ముదముతోడ
నీదు సుకుమారదేహంపు నీడనైన
చూచు భాగ్యము నొందెనా, సుదతి! నేడు

నిన్ను నానాడు జూచిన నిముసమందు
ఎన్నడెరుగని బాధలెన్నెన్నొ నాదు
హృదయవీణ తీగలనెల్ల కదలచేసి
దుఃఖసాగరమున పడద్రోసె నన్ను.

నాడు స్వప్నాలరాణి! నీ నవ్యమధుర
గానమున్ విని నాడు నే కవితలల్లి
మరచి నిన్ దాచితిని మనో మందిరమున
కాని నేడేలకో నీవు కానరావు

రాత్రి పవలెల్ల నామనోరథము దీర్ప
యోచనలు పలుచేసిన తోచదేమి
స్వప్నమందైన నన్ను నీ సన్నిధికిని
చేర్చుకొని నన్ను తరియింప జేయరాదె.

సుగుణ వీవని పొగడుచు సుదతి! నీకు
వ్రాసితిని జాబు రక్తంపు వ్రాలుతోడ
అపొగడ్తలె నేడు నీకంతులేని
గర్వ కారణమయ్యెనా! కఠినహృదయ

ప్రియతమానీవులేని ఈ పృథివినాకు
కాననంబౌను ఘోర దుఃఖముల గూర్చు
కాని నీవున్న యీఘోర కాననములు
స్వర్గసీమలుగా దోచు సకియ నాకు.

---

# రాజా బహద్దర్ వెం॥ రా॥ రెడ్డి

కదురున్ కాడియె భాగ్యమం చెరిగి నీ కారుణ్యపున్ మూర్తితో
పదునై దేడుల చిన్ని ప్రాయముననే బాధాగత ప్రాణులన్
ముదమారన్ పరిపోషణమ్ము జరువన్ బోలుంగదా యంచు నీ
హృదయంబుల్, ధనమున్, సమస్తము ప్రజాశ్రేయస్సుకై
యిచ్చితే

పడచువారల నానాడు పిలచినీవు
విద్యగరిపించి వారల పెద్దజేసి
రాజ్యచక్రమున డిపించి రాణమీర
కీర్తి గడియించితివిగాదె కృషినొనర్చి.

పల్లెలనుండు మాపడుచు బాలురు బాలికలంత నేడు నీ
చల్లనిసేవతో చదువుసందెలు నేర్చి యజ్ఞానులైరి ఈ
పల్లెలవారె భావికపాయములేని పునాదివైచి
మాపల్లెలు స్వర్గసీమలుగ భారతిమెచ్చగ మార్చివైచరే

హలముబట్టియు దున్నెడి హాలికులకు
కలము బట్టగ నేర్పి నీ బలమునంత
ధారవోసిన తెల్గుధీరుడవు తాత
మ్మరువ బోమొయ్యి నీసేవ మరువబోము.

పుట్టితివి తెలుగు గడ్డన పురుష సింహ
నెట్టితివి సింహులోపాల సీదుకృషిని
యుగయుగాలుగ మా తెల్గు గగన మందు
నిలుము తారవై తాతయా నిశ్చలముగ

కరకు తురకల రాజ్యానక త్తి బట్టి
ఘోర చోరుల బాధల చాలవరకు
పారదోలియు మా తెన్గు బాలురకును
మార్గదర్శిగ నానాడు మసలినావు.

పావనంబైన మా తెల్గు పడతినాడు
ఎన్ని నోములు నోచియు నిన్ను కనెనో
ఆమె కోర్కెలు ఫలియింప నామె కీవు
దక్కితివిగాదె తాత! ఈ ధరణియందు

తెలుగు వీరుల ర క్తము జలమువోలె
పారుచున్న దినాలలో పాపమీవు
పాన్పుపై పడియుండియు బాధపడితి
వేమి చేతువు వృద్ధాప్య మిట్లుచేసి

నగర కొత్వాలువై నీవు నాడు కూడ
ప్రేమ పాత్రుడవై తివి పేదలకును

నేడు వృద్ధాప్య మందున తోడునిలచు
యువక సంప్రీతి బడసి నాడవు జగాన

పల్లె పల్లెల నీకీర్తి ప్రాకిపోవు
వీధి వీధుల నీ కథ వీను బడును
తెలుగు మాతలు సుతులకు తెలుపగలరు
తాత నీ కథ తెల్గుల ధాత్రి నిండు.

ఎనుబది రెండు సంవత్సరములిప్పుడు నిండును గాని నీవు
నీ జననికి పిల్లవాడవు ప్రజాళికి తాతయ వెంత చిత్ర
మీ మనుజుడు పుత్రుడొక్కనికి మన్మడు తండ్రి
మరొక్క వానికిన్
కనుగొన నెన్ని యో కలవుగా కలి యందున నిట్టి చిత్రముల్

ధన్యులాంధ్రులు నీ యొక్క ధన్యమైన
జీవితము తోడ లాభాలు చెందినారు
మహిళలకు నీవొనర్చిన మహిత సేవ
సర్వదా చెప్పుకొందురు జనులు వేడ్క

నిదురను మున్గు నాంధ్ర జననీ మణి పుత్రుల మేలుకొల్ప యే
అదురును భీతిలేక కడు నాత్రముతో నభివృద్ధి సల్పి యీ
ముదుర వయస్సు నందయిన మున్కొనరించిన వన్ని జూచుచున్
ముదమును బొందుచుంటివిసి మున్నతి రెడ్డి కులాగ్రనాయకా!

ఆంధ్ర బాలికలకు అతిశ్రేష్ఠమైనట్టి
పాఠశాలను నీవు ప్రీతి తోడ
నిర్మించి నీ యొక్క నిశ్చల ప్రేమను
చాటి నాడవు సర్వ జగమునకును
రేయింబవళ్ళు నీ రెప్పవాల్పక కూడ
లలనామణుల మేలుకోలిపినావు
ఆచంద్ర తారార్క మచ్ఛకీర్తి వెలుంగ

సంఘ సేవనొనర్ప జాలినావు
విశ్వమందున నీ పేరు వెలుగు చుండు
వేలవరమ్ములిక శంక లేల, నమ్ము
రాజ ఓ. బి. ఇ బహదురు రాజబిరుద
తాత! వెంకటరామ! విఖ్యాత కీర్తి.

—:o:—

# నిస్పృహ

ఆరిపోవె జ్యోతి అంధలోకము నుండి
పారిపోరా జీవ పాపిలోకమునుండి
విశ్వమందునవెవడు విలపింపకున్నాడు
ఆత్మ శాంతియులేక అంధకారములోన
కాలకూట విషాలు కడుపులో నుంచుకొని
మానవులు కొందరీ మహిలో నున్నారు
వారినే యిలనింక వర్థిల్ల నీ జీవ
నీవు మాత్రము నేడే వెడలిపో ఓజీవ
ఎంత శ్రీ ఇలనున్న ఏమి లాభము జీవ
కొంతమందే దాని కొననోచిరో జీవ
విశ్వాంధకారాన విలపించి విలపించి
వేసారితివి ఇంక వెడలిపోరా జీవ
ఏ వైపు జూచి నను ఏడ్చువారలె కాని
ఆత్మ శాంతి చెలంగ హాసియించువారేరి.



# మధురగానము

నీ మధుర గానంబు నేడు నా మదిలోన
తీయని కోర్కెలకు తీసింది గాని
కోకిల గళమెత్తి కూయునో ఏమొ
నీ గాన వాహినికి నెదురీద లేక

అమృతంబు స్రావించి హాయిని చేకూర్చు
నీమధురగానంబు నిఖిల జీవుల కెల్ల
కర్కశ హృదయాల కదలించు నీయాట
కరకు బండల కూడ కరిగించు నీపాట

తలలెత్తి యాడించు త్రాచు పాములనెల్ల
గళమెత్తి పాడించు గార్ధబ స్వరముల
కలవరము చెందితిని గాయనీ నేడు
కలలోననైనా కడకొచ్చిపోవె

—x—

# బాటసారి

మధుర స్వప్నాలన్ని మాయమైపోయెనా!
కలలోని నా బ్రతుకు కల్లయై పోయెనా?
సౌందర్య సౌధాల సామాన్య సౌఖ్యాల
నిర్భాగ్య జీవినై నిలచిపోయాను.
జీవితమ్మె ఎడారి భావియే చీకటి
భారమైనట్టి యీ బ్రతుకు ఇంకేమిటికి
ఆశచే జీవించుటంతరించెను గదా
అవకాశమేది అవనిలో జీవించ
ఆనాటి నా ప్రేమ అందాల ఒక సీమ
ఈనాటి నా ప్రేమ ఎడతెగని ఎడారి
ఎడతెగని ఎడారి ఎండమావులదారి
ఎటుల నే పయనింతు ఎచట నే శయనింతు
నిస్పృహా, నిరాశ, నిట్టూర్పు జీవితము
చాలించుటే మేలు జగతి బ్రతుకుటకన్న.

—:o:—

# తెలగాణ

వెలలేని మాగాణరా తెలగాణ
వెలుగు నిచ్చిన దివ్వెరా!
కాకతీయుల నాడు కదన పాండితిజూపి
శత్రుమూకల చెండెరా తెలగాణ
క్షాత్ర ధర్మము నిల్పెరా
పోతనామాత్యుని చేతి కలమునుండి
భక్తిరసముల చిందెరా తెలగాణ
ముక్తిమార్గము చూపెరా తెలగాణ
అధికార గర్వమున అంధులై పోయిన
నైజాము నణచేసెరా తెలగాణ
నవ్యభారతి చేరెరా తెలగాణ
ఆనాడు యీనాడు యేనాడు తెలగాణ
తలవంపు లెరుగందిరా నాతల్లి
బలభీములకు తల్లిరా తెలగాణ



# నా యెంకి

కన్నీరు కార్పలేను నాయెంకి

కలకాల మేడ్వలేను

పున్నమ రాత్రులు యెన్నెన్నొ గడిచెనే

ఎన్నాళ్ళు నీకయ్యి యిటులేడ్తునే నెంకి

తిన్నగాను జేరు సన్నని నాయెంకి

కరుకుబండలు ఎంకి కలలోని ప్రజలంత

కన్నీటితో నేను కలకలమంటుంటె

కసిదీర నగుతారు మసి జేయజూస్తారు.

—X—

# ఎంకి

ఎంకి నినుజూడక ఎన్నాళ్ళు జీవింతు
నిముసంబు నినుబాసి నేనుండలేనెంకి
స్వర్గ నరకాలన్ని సమము నీవున్నపుడు
స్వర్గమే నరకంబు సమ మీవు లేకున్న
ఇద్దరము కలసుండ ఏటికిటు చేసితివి
ఓర్వలేకుంటివా ఓదేవ మముజూచి
ఘోర నరకాలల్లో కూలద్రోసినగాని
ఎంకి నాదరినున్న యివి అన్నిస్వర్గాలె

——

# పాడవే నాయెంకి

పాడవే నాఎంకి ప్రణయ గాథలనెల్ల
ఆడవే నాయెంకి అడివిలో నెమిలోలె
చిన్నారి నాయెంకి ఊతిలోన నీ ఓలె
ఆడువారే లేరు పాడువారే లేరు
పండువెన్నెల చలువ నిండుపున్నమ విలువ
నీవు నేనేకాని నెవరు తెలుసుకోరె
మబ్బొచ్చి చంద్రున్ని అబ్బుకున్నపుడెల్ల
అబ్బ! నా ఎదలోన ఆయాస ముదయించు
ఎన్ని కోట్లు యెంకి యీరాతిరికి విలువ
చిన్నారి నాయెంకి ఊతిని నీ విలువెంతె
పార్వతి నీవయ్యి పరమేశు నేనయ్యి
ఆడుకొందుము రావె అర్ధరాత్రెన్నల్లో



# క్షితిలోన ఎంకి

క్షితిలోన నీ యొక్క సేమమరిసెడు వారు
గతిలేరు కావున కదిలిరా యెల్దాము
ఆలస్యమిక యేలనాఎంకి
అతివేగముఃగ రమ్మ నాఎంకి (ఆదివిష్ణుపు తోడునాఎంకి)
దిన దినము నీవేల సిక్కిపోతున్నావో
కనుగొంటినే రోజుకనబడని చింతంచు
దీనికై నీవిట్లు నాయెంకి
దిగులు చెందగ వద్దు నాయెంకి
పలవిలపించేవు ఏను నీనాడనె
కాదంచు ఎప్పుడైన కలలోన నంటినే
ఊరక విలపిస్తే నాయెంకి
ఘోరదుఃఖము నాకు నాయెంకి
నాకు నీవెతోడు నీకు నేనే తోడు
కాదనంగలవారు కలియుగంబునలేరు
చిరకాలమీ వలపు నాఎంకి
సెదరి పోదెన్నటికి నాఎంకి,

# ఏలనో

ఏలనో నా మనసు ఎంతో సంతస మొందు
నీ పాట, నీమాటనేది విన్ననుగాని
తిన్నగా నాలోన నిన్ను జూచినయపుడె
కోటి స్వర్గాలందుకొన్నట్టులనిపించు
గడువలేదొక దినము ఘడియ నిను తలపనిది
ఎంత తలచినగాని చెంత చేరగరావు
అన్ని వీడుయు నేను ఆత్మ నీకర్పించి
ఉన్న పరువును కూడ మన్నులో కలిపానె
కరుకు బండలుకూడ కరుగు నాగతిజూచి
కర్కశ హృదయంబ? కరుణ నీలో లేదా?

---

# మావిపిందెలదండ

మంచి బంగారుదీ మావి పిందెల దండ
మాఎంకి మెడలోన మరి మెరసిపోతుంది
తళకు తళకున మెరసి వలపులను చిలికించి
తీయబాధలు కలుగ గాయపరిచెను నన్ను
ఎంత సొగసే నీకు ఎందుకో యీనాడు
అందమే నీవయ్యి అవతరించితివేమొ
వేలకన్నులతోడ వేడ్క నినుజూడాలె
ఈ రెండు కళ్ళతోనే జూడలేనెంకి
హరిణలోచని నీకు అంతసొగసిచ్చునే ?
పంచంచు జలతారు అచ్చుమెర్రని చీర.